శ్రీపరదేవతాయైనమః

# తాండవకృష్ణీయ

## మండనఖండనం.



శ్రీమత్సత్పిడపర్తి వంశ తిలకం కౌండిన్య గోత్రోద్భవం । శ్రీశేషాచల పండితోత్తమ సుతం విద్యాగురుం భాస్వరం । జ్యోతిశ్శాస్త్ర సుధాబ్ధిమంథనల సద్ధీమందరాద్రిప్రదం। విద్యాపూర్ణమహం భజామి సతతంశ్రీబాలపూర్ణాభిధం॥

సకలశాస్త్రానుష్ఠానతత్పరులారా !

మహారాజరాజశ్రీ శ్రీరాజా అంకితం వేంకటజగ్గారావు బహద్దరు షేరుమహమ్మదుపురంజమీందారువారు తమచే నియోగింపబడు, శ్రీమాన్ యచ్చార్ల జ్యోతిస్తంత్ర స్వతంత్ర విద్వత్తాండవ కృష్ణార్య దైవవిచ్చక్రవర్తిగారిచే రచింపబడినట్టి శ్రీపరీధావిసంవత్సర శాస్త్రదృక్సిద్ధపంచాంగము, నానాప్రభువులచే బంపబడి, యందలి గుణదోషములను విమర్శించి దెలియజేయమని వారియాజ్ఞాపురస్సరముగ నొకపత్రికను గూడ బంపించియుంటిరి, అందలి గుణ

క మంగళాచరణంబు శిష్టాజనాచరణ ధర్మంబై యున్నదని ప్రాజ్ఞులకు విశదమె.

౨. తూలాంశదిఙ్నిర్ణయప్రశంస.

ఆచార్యులవారు, తమదృక్సిద్ధ పంచాంగమందలియు మాసవిభాగతిథ్యాద్యుక్త వీథ్యవసానమందు పశ్చిమతూలాంశ లు (రేఖాంశలు) ౮°-౩౫'-౩౦" అని వ్రాసిరి. ఇవి శ్రీవిరూపా క్ష జగద్గురు, పూర్వాశ్రమ, శ్రీమత్సర్వతంత్ర స్వతంత్ర సాంఖ్యాచార్య మహర్షి చిట్యాల్ల నరసింహ దైవజ్ఞ సార్వ భౌమలవారిచే, జేయబడిన తిథికల్పవల్లియందుండు ౭·౩౦' ప్రాగ్రే ఖాంశలలో గొంచమించుమించుగ తుల్యములై యున్నవి. ఇవి విశాఖపట్టణమున కిదివరకె యేర్పరచియున్నవి ఈపట్టణ ము సారాద్యక్షోజ్జయనీ రేఖకు ప్రాగ్దిశయందుండుటచేత ప్రా గ్రేఖాంశలని జెప్పుటయుక్తమె అటువలెగాక వాచార్యులవా రు పశ్చిమతూలాంశలని వ్రాయుటచేతను దిగ్భ్రమగలిగి వ్రా సితిరో ! లేక, లేఖకప్రమాదమో! అదియునుంగాక ము ద్రాపణ సమయసంజాత ప్రమాదమో ! తెలియదు, గాని రేఖాంశసంబంధముపంచాంగమందలిలిటను గలిగియుండవలెగా న ఫలనైమిత్యము లేకుండుటకు ముందైనను దిగ్భ్రమదీర్చుకొ నుట యుక్తము. లేక యధార్థమైనయెడల తూలాంశది గ్వ్య వయాచార్యులగారిచే దెలియదగియున్నది.

## 3. తిథ్యాదిమహాక్షేపప్రశంస.

సకలజన వ్యవహారయోగ్యంబగు తిథ్యాదికములు పాశ్చా విద్యావైశద్యముచే నూర్ధ్వతిర్యగ్గ్రహ వీథులయందు వ్రాశియుండిరి. ఇవి కలకత్తా బొంబాయి మొదలగు పెద్దపట్టణములలో నుండు మహావీధులంబడి తెలియనిమనుజుడు ప్రతిగృహముతానుండుగృహంబనిదలంచి వెదుకుచు నిజనివాసంబుగానక యెట్లు నతిదుఃఖమునొందునో! అట్లువలెనే మాచార్యులవారు గల్పించిన తిథ్యాది మహావీథులంబడి దిరుగుచు తమకు వ్యవహారయోగ్యంబగు తిథ్యాదికములు కనిపెట్టలేక నతిదుఃఖితులై యుండవలసివచ్చెను. కాన జనసామాన్యమునకుండు ప్రాచీనపద్ధతియే యుక్తంబని యందఱకును దోచగలదు.

## ౪. దృగదృగ్మత ప్రశంస.

కేవలదృక్సిద్ధగ్రహము (భూపృష్ఠగ్రహములు) చే తిథ్యాదికములు సాధించుటకు ప్రాచీన సిద్ధాంతకర్తల యభిప్రాయము కానట్లు స్పష్టమగుచున్నది. క్రాంతిమండలగత (వాస్తవభూమధ్య స్పష్ట) రవిచంద్రులచే తిథ్యాదికములు చేయవలయునని ప్రాచీన విద్వాంసుల యభిప్రాయమైయున్నది. వాస్తవమధ్యగ్రహసాధనమునకై తత్తత్కాలమునందు సారాద్యానీత గ్రహములకు గలుగు వ్యత్యాసమును సవరించుకొనుచు కోవిదులు తిథ్యాదికములు చేయు సంప్రదాయము

గూడ గనుపించుచున్నది. ఇట్లుండుటవలనని ౪౦౦ సంవత్సరములకు పూర్వమున గల్పించు గ్రహలాఘవకర్త, సౌరానీత చంద్రమధ్యమమందు తమకాలమునకు తొమ్మిదివిఘడియలు తగ్గియున్నట్లు తమగ్రంథమునందు చెప్పియుండెనుగదా; అదిమొదలు వెక్కండ్రు మహావిద్వాంసులు దానివాస్తవమును దెలిసికొనిరో, లేక మహావిద్వాంసుండగు నాగ్రంథకర్త చెప్పినచొప్పున యంగీకరించక దప్పదనిరో, మరియేయేకారణములుగల్పించుకొనిరో, కొంతకాలమునవకలోపంబుజేసియు మరికొంతకాలంబు దశకలోపంబుజేసియు నట్టిచందంబువలన ను తిథ్యాదికమును జేసియున్నట్లు ౧౦౦ సంవత్సరములకు పూర్వమునుండియు గనుపించుచున్నది. ఇప్పటికాలమునకు నట్టివ్యత్యాసము యున్నదో లేదో తత్వమును దెలియనున్న కోవిదులు గనుపరచియుండలేదు. అట్లున్నను యంత్రాధీనంబగుటవలన రాజాశ్రయములేక ప్రాచీనవిధిని యుల్లంఘించి యుండలేను యంత్రాదులవలన వాస్తవమన్యమును గనిపెట్టి సౌరాదులకు వ్యత్యాసంబుండిన సవరించుకొనుట న్యాయంబని నాబుద్ధికి దోచినది. యదార్థము దెలియునంతవరకు తృణజలూకన్యాయంబువలె ప్రాచీనరీతిగ తిథ్యాద్యాచరణంబులవలన కర్మానుష్ఠానం బుచితంబని దోచుచున్నది.

## ౫. కాలనిర్ణయప్రకరణం.

కాలనిర్ణయ విషయంబున నాచార్యులవారు హేతో

స్తులను పరిష్కృతానుసారముగ తెలుపు మూర్ఖుచు తునకు
శ్లో॥ యుగానాంత్రిషునం యాతంతథా (కలియుగం) త్వి
దం॥ అనుచోట ( తథాయాతంయుగత్రియం ) అనుకల్పిం
చుటకు బదులుగ పొరపాటున కల్పించియుండుటో లేక న
శ్లైనచో దానికిఁగల యథార్థసందర్భంబు నాచార్యులవారిచే దె
లి యఁడగియున్నది.

## ౬. పంచాంగయుగ్మ పరీక్షణ.

ఆచార్యులవారు చాలా శ్రమచేసి సౌరదృక్సిద్ధభేదంబు
చే ద్వివిధపంచాంగరచనము చేసి యుండిరి. భారతీయయుగ్మ
రాజయోగ్య. ధీవస్యుగ్మంబులవలె నీపంచాంగయుగ్మంబులుగూ
డ శిల్లరకు నుడువాగకరణము గాకుండ టదు గాక శ్లో॥ నిష్క
ల్పరాస్త్రితిక్కృతిః కృతా మహోదంతచేతా న్వర్థమిమాస్తు వామె
భుక్తేః పస్వయం హి స్వకృతం తత్రసంస్థితిన్నాతత్సన్నాంతు ధీజస్తు
వాన్యే॥ అనుటైరిక సార్వభౌమాక్తి ని బోల్పంబడసేర
తాముకష్టించి రచించు పంచాంగంబు నాచార్యులవారికైనను
శాస్త్రసమ్మతాది సర్వక్రియాకలాపంబుల కగ్రాహ్యం బైనద
ని యాచార్యులవారి స్వోక్తులవలననె దెలియబడుచున్నది.
జాముజ్యోతిష తంత్రస్వతంత్రో ద్రవిడచక్రవర్తి త్యాగి బిరుద
మును బొంది ఈశాస్త్రసంరక్షణమును జేయుచుండెడు మ
హారాజాశ్రయులైయుండెడి వర్ణత్రికాలాధిష్ఠితులై విద్యార్థులకు

ల రెంటితో నతిశయించుచుండు నాచార్యులవారు ( సపసప
న్పస్థానములవల్ల అరానర్థములను పొందువర్ణచతుష్టయ గృహ
స్థులును తమవృత్తికొరకు బాగాలోభపడుచుకొని అసదాత్మ
పక్షాభిమానులను విడనాడి నిర్ణయార్థమై ప్రయత్నించు మా
కీర్త్యాదిగణితశ్రమను దొలగించును ) అను మొదలగు నుపదే
శము స్వరచితప్రబంధాగ్ర్యంబును గూడ మిక్కిలిస్పష్టప
రుచుచు దృగదృగ్గతంబుల నిరుకునుబడి డోలాయమానంబు
గ గృందుచున్నది. లోకమున నుపయోగించునటుల ద్వాస
పంచాంగరచనము జేసితిమనుకొంటిరేమో; ప్రకృతమునలో
కమందు వ్యాపకమునున్న పంచాంగములు సబీజ నిర్బీజక గ్రా
ఘపాత సౌర దృక్సిద్ధభేదములచే నైదువిధములై యున్నవని
యాచార్యులవారికి దెలిసియుండవచ్చును. లోకోపకారవృత్తి
నవలంబించితిమనిరేమి అయిదువిధములుగ గతానుగతికముగ
జేయవలసియుండవచ్చును గాని చక్కగ పరిశీలించి సర్వమత
సమీకరణంబుజేసి లోకోపకారవృత్తితో నొకపంచాంగము
నుజేసినయెడల బహుశ్లాఘనీయమని తప్పక జెప్పవచ్చును.

## 2. శాస్త్రసిద్ధ ప్రశంస.

ఆచార్యులవారు శాస్త్రసిద్ధపంచాంగమందు సౌరమ
తమునుమాత్రమె గ్రహించిరి. శాస్త్రపథము నతిక్రమించి
ఛాయాశాస్త్రపరముచేసినయెడల అష్టబ్రాహ్మ్యాః సర్వసిద్ధాంత

విరోధమైనది. యావచ్ఛాస్త్రపరమని జెప్పిన సౌరముని వక్కా-ణించుట కవకాశము లేదు గాన శాస్త్రసిద్ధమనునపుడు సౌరమతమునుమాత్రము గ్రహించుట యనుచితమైయున్నది. లేక బ్రహ్మోక్త సౌరాద్యష్టవిధ సిద్ధాంతములు ప్రమాణములని జెప్పుటవలన తదంతఃపాతియగు సౌరమును గ్రహించెదమన్న లేని; బ్రాహ్మ్యాదులను విడచి సౌరమును మాత్రమే పరిగ్రహించుటకు కారణము లేదు. ఇదియునుంగాక వరాహకరణమునందు గ్రహించిన పౌలిశ రోమక వాసిష్ఠ సౌర పైతామహ సిద్ధాంతములలో (స్పష్టతరస్సావిత్రః) అను వరాహమిహిరోక్తినిబట్టి సౌరమె ప్రమాణముకానినయెడల, నావరాహమిహిరునిచే సాంప్రతికాలిక సౌరమును పరిగ్రహించినట్లు వరాహకరణమువలననే దెలియుచున్నది. అనగా వరాహమిహిరుడు ౪౨౭ శకమందు కరణగ్రంథమును జేయుచు నప్పటి కాలమందుండు సౌరమతమును గ్రహించెను. ఆ సౌరమందు కువాసరములు కుజాదిభగణములు చంద్రోచ్చపాతభగణములు ఆర్యభటతుల్యములైయున్నవి. బుధశీఘ్రభగణములు సాంప్రతికాలిక సూర్యసిద్ధాంత భగణములకంటెను ఆర్యభటోక్త భగణములకంటెను భిన్నములైయున్నవి. ఈవిషయమై ఆచార్యులవారి గురువులగు సుధాకరద్వివేది పండితులచే జేయు వ్యాఖ్యయందు సహేతుకముగ వ్రాయబడియున్నది. గాన వరాహమిహిరోక్త సౌరమును గ్రహించక నిప్పటి సౌరమును

సూత్మ్యఫలసాధనరజగు మరదశీఘ్రఫలములకు సత్కృత్కారణం బును తత్ఫలంబులకు ధనర్ణవ్యత్యాసకల్పనంబును జ్యార్ధప్రమా ణాద్వైవమ్యంబు మొదలగు తద్భిన్నతంత్రంబును జెప్పియుండు టంబట్టి తమ స్వేచ్ఛాసంచారంబునకుగూడ యవరోధముకలిగ ను॥ గాన శాస్త్రసిద్ధపంచాంగమును నపుడు సౌరమును గ్రహిం చుట కాచార్యులవారి కనుచితధర్మంబని ఘంటానాదంబుచే నుద్ఘోషించుచుంటిమి॥

“కోనిరసం తుల్యాతుదుర్జన న్యాయంబున సౌరమును గ్ర హించుదము॥ శ్లో॥ నయావనం శాసనమస్తి యస్మా దార్యే తథా ర్యాః ( త్వసాశాస్త్రాః ) కులనాదిగ్రియుంతె । న గౌర వాత్సోరమతం క్రియంతె । వాసిష్ఠమస్మాల్లఘుసూక్తి యుక్తం॥ (గురుసూక్తి శాస్త్రం)॥ అనురీతిగా సౌరమతమునకు గురువోపప్రసంగమున గ్రహించగూడదను శిష్టజనోక్తిచే నా చార్యులవారు సౌరమతమునకు దత్తజలాంజలి నొసంగవలసి వచ్చెను॥

ఈశ్లోకము సిద్ధాంత శిరోమణియొక్క వాసనాభా ష్య విశేషార్థచంద్రికయందు జ్యోతిశ్శాస్త్రవిద్వాంసులచే సప్ర మాణముగ గ్రహించుటవలన-నాచేరచింపబడిన వసిష్ఠసిద్ధాం త జగద్విదిశా శాస్త్రజ్ఞులో సుఘోద్ఘాతమందు విస్తరించియుక్తి యుక్తముగ వ్యాఖ్య చేయబడినది.

## ౮. మూలక్షణవిషామృతకాలప్రశంస.

సద్వ్యులచే గ్రహింపు మూలక్షణ విషద్వయకాలంబులను వ్రాయక ఉపేక్షించు నాచార్యులవారి పంచాంగమహావీధులయందు పరిభ్రమించు మనుజుడు తననిజనివాసంబుగానక పెద్దపహారులలోనుండు మహావీధులయందు పరిభ్రమించు కాలంబున వృశ్చికదష్టంబుగూడ గలిగిన మనుజునిచందంబున శ్రౌతస్మార్తాది సకలకర్మంబులందును వింశతిదండాత్మక మూలక్షణ విషస్పర్శనంబు చేగూడనత్యంతదుఃఖాబ్ధిమగ్నుండు కావలసివచ్చుచుండెను. ఇదియునుంగాక తమచే శ్లాఘింపబడు నృసింహాముహ తిథిచక్రిమందు జెప్పిన॥ శ్లో॥ వింశతేష్టచ్ఛ రేధ్యశ్చమూలక్షణస్య పరంవిషం॥ అనుశ్లోకోక్తముగ వింశతి ఘటికాత్మక విషకాలమును విడనాడి షట్పంచాశద్ఘటికాత్మక విషకాలమును మాత్రము వ్రాయుచు। శ్లో॥ అశ్విన్యామష్ట హీనంస్యాద్రోహిణ్యాం ద్వ్యేకసైర్యుతం। ఆర్ద్రాయాంమతుసంయుక్తం శిష్టమ్లేషు ఘటికాన్వితం॥ అనుశ్లోకోక్తముగ నశ్వినీ రోహిణ్యార్ద్రాత్రియ వ్యతిరిక్తంబులగు ఇరువదినాలుగునక్షత్రములకున్నూ తత్తదుక్త విషఘటికాపరంబున చతుర్వింశద్దండాత్మక యమృతకాలమునుమాత్రము దృక్పంచాంగమందు వ్రాయుటకు వారికేమి సూచితమనిదోచియున్నదో, ఊహించవలెను గాని నీవిషకాలము తెలియింపిరియుజ

స్వప్రత్యక్షంబు గాకున్నను, శాస్త్రజన్యప్రత్యక్షంబగుటఁ బట్టి యనేకప్రబంధకర్తలు, అంగీకరించియున్నవను అట్టివిధములను చక్కఁగపరిశీలించి మూఁడైనను వ్రాసినయెడల శ్లాఘనీయంబని చెప్పవచ్చును.

## ౯. వారప్రవృత్తి ప్రశంస.

శ్లో॥ ఉదయాదుదయంవారః॥ అనుపామరజనోక్తిని విడనాడి ఆచార్యులవారు పంచాంగాంతర్వర్తియగు రవ్యాది వారములకు ప్రతిదినంబును ప్రవృత్తికాలము వ్రాసియున్నారు. ఈప్రవృత్తికాలంబు శ్రౌతస్మార్తాది సర్వక్రియాకలాపంబునందు పరిగ్రాహ్యంబని సౌరాదిసర్వసిద్ధాంత తో ష్టూయమానయుక్తియుక్తంబనిగూడ జ్యోతిర్మహావిద్వాంసులచే శ్లాఘింపబడుచున్నది. కాని ఈప్రవృత్తికాల మీదేశమందర్ధరాత్రికాలసమీపంబు గాన నాసమయమునజేయు క్రియాకలాపంబేమియు లేనందున ప్రాచీనవిద్వాంసులు తదవసరకాలంబునదక్క ప్రతిదినమున లెక్కించి వ్రాసియుండలేదు గాన కష్టించి ఆచార్యులవారు వ్రాసినందుకు ప్రయోజనముకద్దు.

## ౧౦. గ్రహణదినకర్తవ్య శ్రాద్ధప్రశంస.

ఆచార్యులవారు పండితపామరపరిగ్రాహ్యంబగు శ్రౌతాది ధర్మశాస్త్రములను సంకుచితముగవ్రాసి బృహత్సంహి

శాస్త్రప్రసంగములనుండి పతితాబాహుళ్యమునుమాత్రము చేసి యుండుటచే వీరుధర్మశాస్త్రవిదులైనను వీరినుసమానసం బానుబట్టి అవిచారణదోషంబువలన పతితాదిధర్మంబులు ఏలి యాకయుండుటేపను యపవాదబాహుళ్యంబును తామునిర్ణయించిన ఫాల్గున శు ౧౪ శనివాసరంబున గలిగిన గ్రస్తోదయ సోమోపరాగంబునందు గలుగు ప్రత్యాబ్దికశ్రాద్ధనిర్ణయంబు ధృఢపరచుచున్నది. కాలమాధవ, కాలచంద్రిక, కల్పవల్లి, నిర్ణయసింధు, ధర్మసింధు, ధర్మప్రవృత్తి, మననరత్న, మదనపారిజాత, హేమాద్రి, మొదలుగాగలమహాప్రబంధంబులందును ఆపస్తంబాశ్వలాయనాది సూత్రములయందును మృతాహపరిత్యాగంబువలన మహాప్రత్యవాయంబు గల్పించి రాత్రియందైనను ముఖ్యానంతరంబున ప్రత్యాబ్దిక శ్రాద్ధంబుగాఁ దవలయునని యుద్ఘోషించుచుండగ పుత్రహీనులగు వితంతువులు రాత్రియందు భోజనాగ్రహత లేనందున నట్టిస్త్రీకర్తవ్యంబగు ప్రత్యాబ్దిక శ్రాద్ధపరంబగు॥ శ్లో॥ పతిపుత్రవిహీనాయాః కర్త్రీ స్యుగ్రహణాదినే। ఉపవాసవిధానాచ్చద్వితీయేఽహ్ని మృతాహకం ॥ గ్రహణాత్తుద్వితీయేఽహ్ని గజచ్ఛాస్తుపంచమే॥ అనుధర్మంబు సర్వులకు నుపయోగించు నాచార్యులవారి సాహసంబు లోకాపవాదాస్పదంబునకు మూలంబని తప్పక చెప్పవలశివచ్చినది॥

## ౧౧. ఛేద్యకచిత్రపత్ర లేఖనప్రశంస.

తనుపంచాంగముతో జతపరచిన ఛేద్యకచిత్రపరిలేఖనంబువలన సైద్ధాంతిక మనోహరంబై యాచార్యులవారి వి

ద్యాప్రాగల్భ్యంబును ప్రకటించుచు విద్వన్మాత్రపరిగ్రాహ్యమై యొప్పుచున్నది. కాని జనసామాన్యమున కుపయోగింప గానందున పంచాంగమునం దనవసరపరిలేఖనంబని తప్పక చెప్పవలసివచ్చినది ఇట్టిశ్రేష్ఠక చిత్రశిల్పజ్ఞులగు జ్యోతిర్మహావిద్వాంసులనేకులున్నను పంచాంగమునందు రచించుటకు జనసామాన్యము గానందున నుపేక్షితులై యుండిరి॥

## ౧౨. దినమానప్రశంస.

ఆచార్యులవారు దినమానసాధనవిషయమై సౌరమును జెప్పినచొప్పున ఇరువదినాలుగు ౨౪ అంశలుగల పరమక్రాంతివల్ల చరసాధనముచేసి సాధించు దినమానమును శాస్త్రసిద్ధ పంచాంగమందును ప్రకృతమున వారికిగలుగు ౨౩°-౨౭′ అంశలుగల పరమక్రాంతివల్ల గలిగిన చరసాధనమునుబట్టి సాధించు దినమానమును దృక్సిద్ధపంచాంగమందును ద్వైవిధ్యముగ వ్రాయుచు సౌరోక్తాయనాంశలకు గొన్ని యుక్తులను గనపఱచి వాటినివిడచి శ్రీ రాజరాజవర్మగారు దాదాశాస్త్రిగారు కేరోపంథుగారు బాపుదేవశాస్త్రులవారు మొదలగు జ్యోతిర్మహావిద్వాంసులు యుపన్యాసములను గనపఱచుచు దృక్సిద్ధశాస్త్రీయమధ్య సూర్యద్వయాంతరాళ రూపములగు అయనాంశములను ప్రకృతమున యంగీకరించియున్నారు. ముందువారికి యెట్టితోడగలుగునో తెలియదు గాన నవిచారణీ

యామాలు ప్రకృతమున ఛాయార్కనిచలన సాధించు అయ
నాంశములను గ్రహించి సౌరోక్తాయనాంశములను విడనాడి
నట్లు అఛాయార్కనిచలన పరమక్రాంతిని సాధించి, చతుర్విం
శతిలవాత్మక సౌరోక్త పరమక్రాంతి త్యజించుట కనం
గీకారంబుగ వ్రాయు మధ్యమమాన స్వల్పాంతరాది యుక్తి లే
ఖనంబు అసందర్భంబును ప్రత్యక్షధర్మవిరుద్ధంబును స్వోక్తి
వైపరీత్యంబునునై యున్నది. ఈయుపాఖ్యానమును బట్టియె
సూర్యసిద్ధాంత తిథ్యాద్యంత నిర్ణయముకూడ నుచితమైయు
న్నదని నాకిపుడు తోచుచున్నది. అనుమొదలు, ఈ సంపాద
నమునకుమాత్రము కర్తవ్యాంశములోచక అందరినలె జేయబ
డినది. మునుపట్లుచేయుటను యుక్తమని తోచలేదు అనుచర
కుగల లేఖనమునకు ఋషికల్పులగు మహావిద్వాంసులచే నిర్ణ
యింపతగిన భాగమైయున్నది. మాదృశులకు శక్యముగాదు.
అను స్వోక్తిచే విరోధము సంభవించినది ఋషికల్పములగు
సౌరాదులను జక్కగ పరీక్షించిన సద్ధర్మములను చక్కగ
బోధించుచుండియుండగ వీరికి విరుద్ధలేఖనప్రసంగ సంగతిగలు
గు నెట్లు, సౌరోక్త పరమక్రాంతికి మధ్యమమాన స్వల్పాంత
రాద్యుక్తులను విడచి సౌరకాలీనపరంబుజేసి ప్రకృతపరమ
క్రాంతిననుసరించి ప్రథమలేఖనోక్తులను దృఢపరచుకుంటు తప
నుసారిగజేయు దినమానమునుబట్టియె తిథ్యాద్యంత నిర్ణయ
ము జేసినయెడల అతిశ్లాఘనీయమని చెప్పక చెప్పవచ్చును.
లేనియెడల తాపేర్పరచిన శాస్త్రదృక్ప్రబోధయు పంచాంగ

మానుండు దినమానభేదములవలన ప్రత్యక్షశాస్త్రవిరుద్ధంబు సంరించుకొనుటకు నుపాయాంతరంబులేదు.

ఇచట నాచార్యులవారు శాస్త్రసిద్ధమనునవుడు సౌరమును గ్రహించిరి గానవారిసౌరమత దృక్సిద్ధాహోరాత్రులనుగూర్చి కొంచము విచారించుదము కర్కాటకాయనదినంబునందు పరమదినమానము మకరాయన దినమందు పరమక్షయదినమానము ఉక్తవిపరీతదినంబులగు మకరాయన కర్కాటకాయన దినంబులందు రాత్రిమానముగూడ పరమంబునొందును ఆదినరాత్రిమానంబులు రెండునుగలసి రవిసావనాహోరాత్రిప్రమాణంబగును. గాన వారియుభయ పంచాంగముల యందుగల పరమదిన పరమక్షయదిన మానముల నిచట కనుపరచెదము.

| | సౌరమతం. | దృక్సిద్ధం. |
|---|---|---|
| పరమదినమానము | ౩౨-౪౧ | ౩౨-౫౦ |
| పరమక్షయదినమానము | ౨౭ ౧౯ | ౨౭ ౩౪ |
| ఉభయదినములయందు గలుగు అహోరాత్రిమానం ఇది నాక్షత్రాహోరాత్రి సమమైయున్నది. | ౬౦-౦ | ౬౦-౨౪ ఇది సావనాహోరాత్రిప్రమాణముకన్న నధికమైయున్నది. |

తమశాస్త్రసిద్ధమగు సౌరమతమున సంపాదించు నది సావనాహోరాత్రిప్రమాణ తుల్యములగు పరమదిన పరమక్షయ దినమానములు సౌరవిరుద్ధమును నాక్షత్రాహోరాత్రిమా

వతుల్యములుగా నెంచి సాధించిరి గాని వీరిమహిమాతిశయ ముచే నుభయ పంచాగములలో రవిసావనదినరాత్రి మాన ములకు పరిక్రమభంగములేకుండగను మొదటినుంచి తుదవరకు తిథ్యాదులయందుగూడ షష్టిదండాత్మక సాక్షాత్రాహోరా త్రిమానమును నెవాతిరి. దృక్పంచాంగమందు వ్రాశినపరమ క్షయసిన పరిమాణ తుల్యమగు రవిసావనాహోరాత్రిమానము మేషాదిసంక్రాంతులయందు ౫.౯.౧౦.౧౧ వినాడికలధికము గనుండు షష్టిదండాత్మకకాలముకంటె చతుర్వింశ ద్విఘటి కాధిక షష్టిదండాత్మకముగ వ్రాశియుండిరి గాన వారిపరి క్రిమభంగమెగాక విరుద్ధప్రసంగమున్నూ కలిగినది.

## జ్ఞాపకమువచ్చినది. పొరపాటు.

ఆచార్యులవారు తమశాస్త్రదృక్సిద్ధోభయ పంచాంగ ములయందు శాస్త్రసిద్ధ రవిసావనాహోరాత్రిపరిమాణమగున ట్లు కర్కమకరాయనదినీయ రవిసావనాహోరాత్ర ప్రమాణ మందుగల అధికవినాడికలు ౧౨ చొ॥ ఉభయపంచాంగముల యందున్నూ రెండహోరాత్రులకు ౨౨ వినాడికలు కొంచ మించుమించుగ దృక్సిద్ధపంచాంగమందు కర్కామకరాయన దినములయందు వ్రాసియున్నారు. కాబట్టి వీరిచూడగ పొరపాటుగానరాదు. విచారించగ వీరు అహర్గణితక్రి మము నొందకనె అతిసుకుమారము చేతను ప్రాతపుస్తకముల యందుగల నృసింహాపదకమునందుండే హారర్ధమును (అంద రిపుస్తకములలో అనేకవిధములుగ నన్నది.) గ్రహించి అ

హోరాత్రమంతయు పూర్ణముగనొంది మలచటిశనముసగూ
డ మిగిలియుండు తిథ్యాదికమును వ్రాయుటలో పూర్వపు
బసిదదువులయందు జెప్పినచొప్పన రాత్రింబవళ్ళు అరువదిగ
డియలను పామిపరికారము వ్రాశియుండిరి కాబోలు ఆకార
ణముచేతనే అంతటను అరువదిఘడియల యహోరాత్రముని
వాడిరి. దృక్పంచాంగమందుఅటువలెగాక వీరు గ్రీన్‌విచ్ నా
టికల్ ఆల్మనక్ యందున్నూ ప్యారిస్ ఆల్మనక్ యందున్నూ గ
ణనూర్యాది దృగ్గ్రహములను స్వరేఖాసంపాదితులుగా చేసి
నిరయనులనుగావించి లోకమునకలంకరించిరి, తెలియడల ఇంత
కంటెగణితశాస్త్రమును పొందియుండలేకనుకుమారతనముచే యుం
డువారికింత గణితసముద్ర తరణంబును జేసియుండలేదని నాన
మ్మికగాన లండీయదృగ్గ్రహములను స్వదేశసంపాదితులుగా జే
యుసమయమున గలుగున్యత్యాసమని చెప్పకతప్పదు. ఇది
వరకెచటను ఎప్పుడును వీరిపంచాంగముగావరానందున పరి
క్రియాంశమందు (తంత్రమందు) నిపుణులైయుండినట్లుతోచ
రాదు గాని అర్ధికాంశమందలి విద్వద్వరిష్ఠులని వినియుంటిమి
గనుకనె ఇట్టిగణితశాస్త్రమును ఆచార్యులవారు బొందియుండు
టంబట్టియె వీరు జ్యోతిషతంత్ర స్వతంత్రులని పిలువబడుచుం
టిరి. ఇదియంతయు వీరు తాండవకృష్ణులు గాన వీరిపుణ్యా
తిశయమునగలిగిన యశోవిశేషంబు గాని విద్యాప్రాగల్భ్య
గాదు. చిరకాలమునుంచి లోకరంజకంబగు జ్యో

త్రిముఖంను మేముపాత్రిధుల మైయుండినను వారికినలె మాకు తంత్రస్వతంత్రితను విలువబడియుండుట లేదుగదా !

కింవాక్కైశవ భాషగానేనబహుశా పు॥

తె॥ అను శ్రీకృష్ణకర్ణామృతోక్తి చందంబున గలిగియున్న దిగదా !

## వి జ్ఞా ప న ము.

పండితపామరులెల్లరకును దెల్లమగునటుల తేటతెనుగుతో స్థాలీపులాకముగ నీపదిరెండు ప్రశంసలనుమాత్రము వ్రాసితిని గాన నీమండన ఖండనరూపముగు వావాక్యఘటితయంపలి తప్పులు కప్పలకుప్పలుగ నుండినను॥ శ్లో॥ ప్రత్రిఙ్గవవత్తు శైవమధురం తద్బాల్యసంజల్పవత్ ॥ అను కాళిదాసోక్తి చే బాలుని మృదుమధురవాక్యంబు చందంబునను కలహంసల నీరక్షీరవిభాగంబుచందంబునను, జ్యోతిర్మహా విద్వాంసులెల్లరును అంజలి సుగుణములను గ్రహించియానందింతురు గాక.

శ్రీమచ్చీమలపాటి మరిడయ్యసిద్ధాంతి సోమ
యాజి జగద్దీపిగారుల చే రచింప
బడి తాండవకృష్ణీయ మండన
ఖండనం జయతి.
వరాంబికా కృపయా
శ్రీ శ్రీ శ్రీ

